"నేను మళ్ళీ చూస్తాను—"

"ఆయన్నడుగు—ఒకే సినిమా రెండుసార్లు చూడవచ్చు నేమో?"

నరేశం కలుపుగోలుతనానికి కరుణాకరం ఆనందభరితు డయాడు. ఆపదేళ్ళపిల్ల కరుణాకరంవంక లేడిచూపులు చూసి కాసేపు యిటూ అటూ తిరిగి లోపలికి వెళ్ళి పోయింది.

"మీరు సినిమాకి వెళ్తున్నట్టున్నారు ఇంక నేనువెళ్తాను. Many thanks for your kindness."

"ఉండండి" అంటూండగా పదహారు పదిహేడేళ్ళ మ్మాయి వచ్చి, "పెదనాన్నా, ఊర్మిళ కిందపడి పొర్లి ఏడు స్తోంది. సినిమాకి తీసుకువెళ్తానని చెప్పూ దానితోటి" ఆపద హారు పదిహేడేళ్ళమ్మాయి కరుణాకరంవైపు చూసింది— కాని అతనితో నాకేంపని అన్నట్టు, పెదనాన్నని ఉద్దేశించి, ఊర్మిళ ఆకతాయితనం చెప్పింది.

"మొన్న రాత్రి వాల్టాక్సురోడ్‌లో దించానన్నాను—ఈయనే—"లా" చదువుతున్నారు."

ఆ అమ్మాయి నమస్కారంచేసింది. కరుణాకరం లేచి నుంచుని నమస్కృతు లందుకుంటూ ప్రతినమస్కారం చేశాడు.

"మా అమ్మాయే—సుమిత్ర. స్కూలుఫైనలు పాస యింది"

"చదవడం మానేశారా ?"

"వాళ్ళమ్మ జబ్బుమనిషి. తను బతికుండగానే దానికి మూడుముళ్ళూ పడాలంటుంది."

"నువ్వు చెప్తే వినదేమిటి అమ్మ! నీకూ నేఁ పంక చదవడ మిష్టంలేకనే మానిపించావ్ !"

"మనకెందుకే అమ్మా చదువులు? ఉన్నది చూసుకుంటే చాలు"

కరుణాకరానికి సంభాషణలో జొంపడాలని వుంది. అవ కాశంకోసం చూస్తున్నాడు.

"మీరు చూశారా 'వహ;'" సుమిత్ర అడిగింది.

"లేదండి"

"చాలా బావుంటుందట. మా ఫ్రెండ్సంతా చెప్పారు"

"అయితే మీరుకూడా మాతో ఎందుకు రాకూడదూ?" అన్నాడు నటేశం. అది ప్రశ్నార్థకమా, ఆశ్చర్యార్థ కమా? బతికిపోయాడు కరుణాకరం. నిక్షేపంగా వస్తాడు. కాని, ఈ ప్రపంచమంతా కొత్తగా ఉంది అతనికి. సినీమాలో నటేశ మొదలియార్ సుమిత్రకీ కరుణాకరానికీ మధ్య కూచున్నా చిత్రాన్ని పొగడటంలో యిద్దరితో ఏకీభవిస్తూ, ఊర్మిళకి రెండు కప్పులు ఐస్‌క్రీమ్ పెట్టించాడు.

ఆపైన కథంతా సవ్యంగా దివ్యంగా మనోజ్ఞంగా రామ ణీయకంగా నడిచింది. నటేశం అన్నకూతురు సుమిత్ర. ఆ అన్నగారు పరమపదించి చాలాకాల మవుతుంది. నటేశానికి

పిత్రార్జితం బంగాళాలూ, కలపవ్యాపారం ఉన్నాయి. వొదిన గారు జబ్బుమనిషి అవటంచేత అన్నగారి కూతురూ కొడుకూ (సుమిత్ర కంటె చిన్నవాడు) నటేశందగ్గిరే పెరుగుతూ వచ్చారు. సుమిత్రకి రెండు మూడు మంచిసంబంధాలున్నాయి. ఈ వేసంగిలో ఏదో ఒకటి నిశ్చయం చేదామనుకుంటున్నారు.

రెండు నెలలు గడిచేటప్పటికి నటేశం కరుణాకరాన్ని ఈ భవనప్రాంగణంలో ప్రవేశపెట్టడంలో నిమిత్తమాత్రుడా అని తోచింది, సుమిత్రా కరుణాకరాల ప్రణయాన్ని [illegible] కూడా తెలుసుకోగలిగింది. ఇద్దరూ దాపరికం లేకుండా ప్రవర్తించేవారు. దాచవలసిందేముంది? వయసులోవున్న అమ్మాయి వయసులోవున్న అబ్బాయిని ప్రేమిస్తోంది. అమ్మాయి తమది—నిప్పులాంటిపిల్ల; తెలివితక్కువ రకం కాదు. అబ్బాయి చామనచాయగా వున్నా రూపసి. ముక్కూ మొహం బావుంటాయి. వయసుకి తగిన రూపం విద్యా ఉన్నాయి. డబ్బా? తమకున్నది చాలు. ఒక్క యేడాది జరిగితే ప్లీడరు పట్టా పుచ్చుకుంటాడు. సూటూ టై లేకపోతే తనని లోనికి రానిస్తాడా అనుకున్న వాచ్‌మేన్, అబ్బాయిగారు సాయంత్రం వచ్చేవేళకి పూలగుత్తి కోసి, గేటుదగ్గిర అందిస్తున్నాడు. అది అబ్బాయిగారు అమ్మాయిగారికి బహూకరిస్తారు.

కరుణాకరం అదృష్టం ఒకరికి చెప్పడానికి వీల్లేనిది; చెప్పినా అర్థంకానిది. క్రిస్టమస్ సెలవులకి యింటికి అనగా

స్వగ్రామం - వెళ్ళడం మానేశాడు. పరీక్షకి కష్టపడిచదవా లని అబద్ధం రాశాడు. ఏమైతేనేం, సుమిత్ర రాజబాట కరుణాకరం తన ప్రియుడని స్పష్టంగా అంటుంటే. ఆత్మీయు లకి ఆమెమనసు తెలుసు. కాని కరుణాకరం తండ్రిచాటు వాడు. అతను బ్రాహ్మలబ్బాయి కావచ్చుగాని సంస్కార దృష్ట్యా సుమిత్రదే ఉత్తమసంస్కారం.

కరుణాకరం యింట్లో అందరికీ చనువయ్యాడు. వరసవర సనా అందర్నీ పిలిచేవాడు. ఇరుగూపొరుగూ పప్పన్నం ఎప్పుడనేవారు, నటేశానికి కాబోయే అల్లుడని అందరూ అనుకోసాగారు. ఇలా వుండగా......

సాయంత్రం అయిదున్నర అవుతుంది. సుమిత్ర కింద కనిపించలేదు. మేడమీద వుంటుందని తిన్నగా ఆమె గది దగ్గిరికిపోయాడు. వోరగావున్న తలుపు లోనికితోశాడు. డ్రసింగ్ టేబుల్ ముందు కూచుని టాయిలెట్ చేసుకుం టోంది. తెల్లటిచీరె ధరించింది. యింకా జడ అల్లుకోలేదు. బాడీ ఒక్కటే వేసుకొని వుండటంవల్ల కరుణాకరం ప్రవేశం అద్దంలోనుంచి చూసి పైట భుజంమీదకి లాక్కుని, 'హల్లో' అని ముద్దుచేస్తూ అతన్ని ఆహ్వానించింది. కరుణాకరం దగ్గిరికి వెళ్ళి, యిద్దరిమొహాలూ అద్దంలో పరికించాడు. 'రేపు పెళ్ళిలో అలాగే ఫోటో తీయించుకుందాం'' అంటూ అతని బుగ్గ గిల్లింది. అందుకు పరిహారంగా ఆమె రెండు చెక్కిళ్ళనీ నుదిటినీ, పాపిటినీ. మెడనీ ముద్దెట్టుకున్నాడు. జడ అల్లుకో

వడం అయినతర్వాత "ఒక్కసారి బయటికి వెళ్లు" అంది సుమిత్ర.

"ఏం ?"

"నేను జాకెట్టు వేసుకోవాలి."

"వెళ్ళను" అన్నాడు, ప్రేమ నేర్పే ముద్దులు గుడుస్తూ.

"బయటికి గెంటి తలుపేసుకుంటాను" అంది సుమిత్ర.

కరుణాకరం మొహంలో కాస్త కోపం కనిపించింది. సుమిత్ర తక్షణం కనిపెట్టి, 'మా బాబువి కదూ, నువ్వు మంచివాడివి' అంటూ గడ్డం పుచ్చుకు బతిమాలి, తన పెదవులతని పెదవులకి అందించింది. వారి ప్రత్యేక ముద్దుల్లో ఒకటి. కరుణాకరం ఆమెని పొదివి పట్టుకున్నాడేగాని వొదిలిపెట్ట బుద్ధవలేదు. సుమిత్ర నెమ్మదిగా కౌగిలి విడిపించుకొని కరుణాకరాన్ని గుమ్మం వెలుపల నుంచోబెట్టి, తనులోపల గడి వేసుకొని జాకెట్టుమార్చుకొని, మళ్ళీ మామూలు చిలకలా కిలకిల్లాడటం మొదలెట్టింది.

కరుణాకరానికి సుమిత్రమీద తీవ్రవాంఛ చెలరేగింది. అతని మనసు ఏవో కుయుక్తులు పన్నుతోంది. కాళ్ళమీద పడైనా సుమిత్రని బతిమాలుకోవాలనిపిస్తోంది. మూడు నెలలనుంచీ లేని చిత్తసంక్షోభం ఈ సాయంత్ర మెందుకు పుట్టిందో!

ఇంట్లో అందరూ తలో పని మీదా వున్నారు. ఇంకా [illegible]య్య రాలేదు. ఏవో కారణం కల్పించి సుమిత్రని

మేడమీదికి తీసుకువచ్చాడు కరుణాకరం. సుమిత్ర తన గదిలో స్విచ్ నొక్కబోతూ వుండగా వారించి, అమాంతం తనకౌగిలిలోకి తీసుకున్నాడు. సుమిత్రకి ఇలాంటి చీకటిముద్దు అలవాటయాయి కనక ఎదురు చెప్పలేదు. ఆమెను బిగికౌగిలిలో బంధించి అన్నాడు: 'ఈ రాత్రి నిన్ను వొదలలేను సుమిత్రా.' అతని వేడిశ్వాస ఆమె చెంపల్ని తాకుతోంది. సుమిత్ర రాయీ రప్పా కాదు. రక్తమాంసాలున్న మనిషి. 'కరుణ్, దీపం వెయ్యనీ' అంది జాలిగా.

"వొద్దు—వొద్దు."

"నేనెక్కడికిపోతాను, కరుణ్! వెలుతురంటే అంత భయమెందుకు?"

"నాకు వెలుతురొద్దు—చీకటే కావాలి."

"వెర్రివాడివి, కరుణ్, వెలుతురులో నన్నుజూస్తే భయమేస్తుందా?"

"అవును."

అతను వొప్పుకున్న నిజానికి ఆమె పారవశ్యం చెందింది. అభ్యంతరం చెప్పదలుచుకోలేదు, ఎందుకంటే—అతన్ని నమ్మింది. తను లొంబడి పోతున్నాననే భయం ఆమెని ఒక పక్క పీడిస్తూనేవుంది. మంచంమీద కూచుని కరుణ్ తల నిమురుతూ, లాలిస్తూ మనసు మార్చగల ననుకుంటూ, ఆఖరికి అతని వొళ్ళోకి వొరిగిపోయింది.

మెట్లు దిగుతున్నప్పుడు గాబోలు అతని భుజంమీద చెయ్యేసి, "కరుణ్, మనం తొందరలో పెళ్ళి చేసుకోకపోతే నాకు మనస్తాపం కలుగుతుంది."

"అలాగే—నాదేం ఆలశ్యం, తొందరగా ముహూర్తం పెట్టించు" అన్నాడు కరుణాకరం

ఆ తరువాత సుమిత్ర ఏనాడూ కరుణాకరాన్ని కాదన లేదు. ఏదో పీటలుచూసుకొని అతనితో మేడమీదికి వచ్చేది. జబ్బుమనిషికి ప్రాణంమీదికి రావడంవల్ల ముహూర్త నిశ్చయం అనివార్యంగా ఆలస్యమయింది.

జబ్బుమనిషి ఒక దుష్టనక్షత్రాన యిహలోకయాత్ర పూర్తిచేసింది. ఆమె చనిపోయేవేళ కరుణ్ సుమిత్రా ఆమె మంచంపక్కనే వున్నారు. ఇద్దర్నీ పెళ్ళిజేసుకోమని ఆమె ఆశీర్వదించింది. తల్లిచావు సుమిత్రని కాస్త కలవరపెట్టింది గాని, కరుణ్ అండచూసుకొని శోకాన్ని దిగమింగింది. సుమిత్రా, సుమిత్రతమ్ముడూ అనాధలైపోయారు మాతృ మరణంతో.

జబ్బుమనిషికి వ్యాధి ఎక్కువైనప్పట్నుంచీ కరుణాకరం వాల్టాక్సురోడ్‌లో వున్న తనగదికి పోవడమే మానేశాడు. మకాం నటేశమొదలియార్ ఇంటిలోనే. నలుగురూ వింటే బావుండదని అతనికిమాత్రం కిందగది-గెస్టుహామ్‌యిచ్చారు. వారానికోసారిపోయి వాల్టాక్సురోడ్‌లోని గదిలోనుంచి తనకొచ్చిన ఉత్తరాలూ అవీ తెచ్చుకునేవాడు. ఇప్పుడు

తండ్రి మనియార్డర్ మీద ఆధారపడవలసిన అగత్యంకూడా అంతగా లేదు. తల్లి బతికుండగా ఒకరోజు సుమిత్ర తల్లినడిగి అయిదువందలు పుచ్చుకొని సిల్క్, ట్వీడ్, ఫులెన్ సూట్లు ఆరూ; ఒకడజను యింగ్లీషు పాప్లిన్ షర్టులూ కుట్టించి తీసుకు వచ్చింది. కరుణాకరం యింటర్ ప్యాసైనప్పుడు వాళ్ళమ్మ-రికమెండ్ చేయగా నాన్న ఒక ట్వీడ్ సూట్ కుట్టించాడు. కరుణాకరం వాలకమంతా మారిపోయింది. అతని సహాధ్యాయులు కాపీ తియ్యడం మొదలెట్టారు.

కరుణాకరం మధ్యరకం కుటుంబంలో పుట్టివుండటంవల్ల అతని నీతినియమాలుకూడా మధ్యరకంవే. నరేశ మొదలియార్ లాంటి ఘరానామనిషని చెప్పడానికి వీలులేదు. నరేశం అతన్ని అన్నివిధాలా నమ్మి యింటిలో స్థానమిచ్చాడు. సుమిత్ర అనురాగంమాట అటువుండగా ఈ నాలుగునెల లోనూ ఒక్కనాడూ కరుణాకరం సుమిత్రని తను పెళ్ళి చేసుకోవడంవల్ల, తను పోదులుకోవలసిన విలువలగురించి తీవ్రంగా ఆలోచించలేదు. పెళ్ళంటే—ఆ—అంటున్నాడు. తల్లికీ తండ్రికీ తను దూరమవుతాడు. చండశాసనుడు తండ్రి తిన మొహంకూడా చూడడు. ఆడది తల్లి బావురుమని ఏడుస్తుంది. కుటుంబానికివచ్చే అప్రతిష్ఠవల్ల తన చెల్లెలికి తొందరగా పెళ్ళికాదు. తను ఏకాకి అవుతాడు. సుమిత్ర కరుణా కటాక్షం, మంచితనం మినహా తనకేముంటాయి ? మేనత్త కూతురు సరళకీ తనకీ రామ్ రామ్.

సుమిత్రతో పెళ్ళంటే తనకీ తన బంధువులకీ మధ్య కంచుగోడ. సరసాలాడే సరళ, చెల్లెలు కుసుమం, ఏభై యేళ్ళు పైబడ్డతల్లి, తను చేతికందుతా డనుకుంటున్న తండ్రి, తమ దొడ్లో వేసిన పూలమొక్కలు, మేడగదిలోని పుస్తకాల బీరువా—ఒక టేమిటి అన్నీ పోతాయి. కాని, వీటన్నిటి కంటె సుమిత్రప్రేమ గొప్పది కాదూ! పాతవాసనలు—కొత్తసౌరభం, రెండూ బలీయమైనవే!

పరాకుగా కూచున్న కరుణాకరం రెండుకళ్ళూ మూసింది సుమిత్ర.

"పేరు చెప్పాలా?"

"చెబుదువుగాని—మళ్ళీనెల మూడోతారీఖునట. మీ ఫాదర్, మదర్ వస్తారా?"

"నేను వెళ్ళి నచ్చజెబితే..."

"బాబోయ్—నిన్ను పంపను. నిన్ను వదిలి వుండలేను బాబూ" అంటూ సుమిత్ర అతనికంఠం కౌగలించుకుంది.

ఆమెకళ్ళలోకి చూస్తూ అన్నాడు కరుణాకరం "ఎప్పుడూ నన్నిలా ప్రేమిస్తావా, డియర్."

"ప్రేమించక—కరుణ్, ఎందుకొచ్చిం దాసంశయం నీకు."

"సంశయం కాదు, పుట్టినే అడుగుతున్నా, పెన్నిధిని పదే పదే చూసుకునే పేదవాణ్ణి నేను."

"పెన్నిధే పేదవాడివర మవుతూవుంటే..."

"నిజమే, నాలో ఏ ఘనతచూసి ప్రేమించావు నన్ను, సుమిత్రా ?"

"అదంతా నాకు తెలీదు. నువ్వు మంచివాడిలా కనిపించావ్."

"నిజంగా మంచివాడినా ?"

"ఒక్క విషయంలో మినహా" అంటు కరుణాకరం బుగ్గలు సాగతీసింది.

కరుణాకరాన్ని ఎవరో భాగ్యవంతుల పిల్ల బుట్టలో వేసుకుందన్న శుభవార్త తండ్రిదగ్గిరికి మోసేందుకు వార్తాహారులకి కొదువా! కడుపుబ్బుపట్టలేక ఒక అఖండుడు ఆకాశ రామన్న ఉత్తరం కూడా రాశాడు.

"ఆర్యా! తమ కుమారుడైన కరుణాకరం బొత్తిగా చెడిపోయినాడు. ఒక మొదలియార్ల పిల్ల అతన్ని చేరతీసింది. మీవాడి చదువుసంధ్యలు గంట వాయించినయ్. ఆపిల్ల పినతండ్రి పరమదుర్మార్గుడు. మీ అబ్బాయిని వాళ్ళు ఖూనీ చేయించవచ్చు. తొందరలో మేల్కొనండి-మీ శ్రేయోభిలాషి."

ఈ ఉత్తరం చదువుకొని వెంకట్రామయ్య వీరహనుమానుల్లా యింట్లో యెగిరాడు. ఎవరో కిట్టనివాళ్ళు కల్పించి రాశారేమో అన్న పెళ్ళాంమాటలు చెవిని పడితేనా! మర్నాడు మైలులో నురగలు కక్కుకుంటూ మద్రాస్ వచ్చాడు.

మెయిల్ దిగి వెంకట్రామయ్య ఎకా ఎకి వాల్టాక్స్ రోడ్‌లోని కొడుకుగదికి వెళ్ళాడు. గది బీగంవేసివుంది. యిరుగు పొరుగును విచారించాడు. కరుణాకరం ఏగంగలో కలిస్తే ఎవడికెక్కాలి? శ్రేయోభిలాషి అడ్రసు తెలియనందుకు ఎంతో విచారించాడు వెంకట్రామయ్య. మరో చోట బసచేసి, రెండురోజు లనంతరం, వెంకట్రామయ్య కొడుకుని మౌంటురోడ్ ఫుట్ పాత్ మీద కలుసుకోగలిగాడు. "నాయనా, నిన్ని కళ్ళతో చూస్తాననుకోలేదు" అన్నాడు బావురుమంటూ. కరుణాకరానికి ఉపద్రవ మేమిటో తెలీలేదు గాని, తండ్రికి గూఢచారులద్వారా వార్త తెలిసివుంటుందని భావించాడు. ఇద్దరూ వాల్టాక్స్‌రోడ్‌లోని గదికి వెళ్ళారు.

"నాయనా ఏమిటీ అప్రతిష్ఠ!" అన్నాడు వెంకట్రామయ్య.

"ఏమొచ్చింది? ఆ అమ్మాయి సద్గుణవతి. ఈరోజుల్లో కులగోత్రా లెవరికి కావాలి?"

"నిజమే. నీకక్కర్లేదు, మామాటో?"

"పెళ్ళిచేసుకుంటున్నది నేను, మీరు కాదు."

"పిల్లలే కరువయ్యారా? నిరుడు వేసంగిలో సరళనే చేసుకోకపోయావా? బి.ఎల్ అయ్యేదాకావద్దని యిలా నడిసముద్రంలో ముంచుతున్నావా మమ్మల్ని?"

"ముంచడంలేదు. సుమిత్ర యోగ్యురాలు, రండి వారింటికి వెళ్దాం."

"నేనా ? కంఠంలో ప్రాపిరివుండగా అలాటియింట్లో పాదంపెడతానా ? ఆ అమ్మాయికి డబ్బువుందిగదా అని నువ్వు కులుకుతున్నావ్ ! పెళ్ళయేదాకానేగాని ఆపైన నీమాట వింటుందా—డబ్బున్న ఆడది. మాకర్మఫలం" అంటూ తండ్రి వుప్పెనగా ఏడ్చాడు. చండశాసనుడైన తండ్రి ఏడవడమేమిటి ? ఆయన తనను నాలుగు తిడితే బావుండేది; క్రోధం పట్టలేక తనూ అనేవాడు. వెంకట్రామయ్య చలిమిడిముద్దలా అయిపోవడంతో కరుణాకరానికి ముందడుగు తోచలేదు. సుమిత్ర తనను చీదరించుకుంటుంది, చెట్—అసంభవం. ఈయన అమ్మను ప్రేమించి పెళ్ళిచేసుకొన్నాడా ? ప్రేమంటే తెలుసా ఆకాలపువాళ్ళకి. సుమిత్ర దృష్టిలో తను లోకువవడం సంభవనీయమా ? కాదు—అవును.

ఆసాయింత్రం సుమిత్రజడలో పూలు తురుముతూ అన్నాడు, "మా నాన్నగారొచ్చారు."

"ఏరీ ?"

"వాల్టాక్సురోడ్‌లో వున్నారు"

"మనింటి కెందుకు తీసుకురాలేదు"

"అమ్మకి వొంట్లో బావులేదట. వైద్యానికి వూరు తీసుకువద్దా మనుకుంటున్నారట."

"మరి మనసంగతి చెప్పావా ?"

"ఆయనకి తెలుసు."

"ఏమన్నారు ?"

"ఏమీ అనలేదు."

"నిజంగా ?"

"నిజం !"

"మైలాపూర్‌లో యిల్లు మాట్లాడారు. నన్నుపోయి అమ్మనీ, చెల్లెల్నీ తీసుకు రమ్మంటున్నారు."

సుమిత్రస్థితి వర్ణనాతీతం. తల్లికి వొంటిలో బాగులేదని తెలిసి ఎలా వెళ్ళొద్దంటుంది కరుణాకరాన్ని ? కాని, ఆమెకి కరుణాకరాన్ని వొదలడం హితవుగా లేదు. "నేనుకూడా వస్తాను" అంది.

"మాబంధువులు మంచివాళ్ళు కారు. నిన్నేదయినా అంటే నొచ్చుకుంటావ్. మూడో లేదీ పదిహేనురోజులు కూడా లేదు."

"ఎన్నాళ్ళకి వస్తావ్ ?"

"ఎల్లుండి వుదయం మెయిల్‌కి"

"అయితే ఈరాత్రే వెళ్తావా ?"

"ఊఁ"

సుమిత్ర గబగబా సూట్‌కేసులో బట్టలు సర్దింది. సెంట్రల్‌కి ఫస్టుక్లాసు బెర్తుకి ఫోనుచేసింది. బీరువాలోంచి మూడు వందరూపాయిల కాయితాలుతీసి కరుణాకరం పర్సులో పెట్టింది. ప్రయాణపు ఏర్పాటులన్నీ అరగంటలో ముగించి, కారు సిద్ధంగా వుంచమనిచెప్పి మేడమీదికి వొచ్చింది.

కరుణాకరం రైలు కట్టుకుంటున్నాడు, సుమిత్ర రావడం చూసి వెనక్కి తిరిగి రెండు చేతులూ చాచాడు. ఆమె కను కొలకుల్లో పేరుకుంటున్న బాష్పాలకి నిలవకట్టలేక పోయాడు. కవిశ్వరుడూను.

"రెండురోజుల వియోగం" అన్నాడు కరుణ్.

"రెండుయుగాలు."

"నాకుమాత్రం ?"

"ఎల్లుండి మెయిల్ ఆలస్యం అవకుండా వుండాలి బాబూ !"

* * * *

ఆ ఎల్లుండికోసం సుమిత్ర మూడు నెలలు ఎదురు చూసింది ! ఆమె కళ్ళు కాయలుకాచాయి. ఎవరూ తన మొహంమీద అననప్పటికీ నలుగురిలోనూ నగుబాట్లుకదా! నవేశం తను వెళ్ళి కనుక్కుని వస్తానన్నాడు. సుమిత్ర వద్దని నిష్కర్షగా అంది.

కరుణాకరం తల్లికి జబ్బూలేదు; గిబ్బూలేదు. కొడుకు ఏ మాయోపాయానికీ లొంగకపోవడంవల్ల వెంకట్రామయ్య "ట్రంప్ కార్డు" ఆజబ్బుని కల్పించాడు. కరుణాకరం రైలు దిగి యింటికి వెళ్ళగానే యింట్లోవాళ్ళందరూ బావురు మన్నారు. ఆ ఏడుపువిని ఎవరు చచ్చిపోయారా అని పస్తా యించాడతను. ఎవ్వరూ చావలేదు, అందరూ దుంగ ముక్కల్లా ఉన్నారు. ఇంటిలోవాళ్ళూ యిరుగుపొరుగు బంధువులూ కాకుండా, సరళా ఆమెతల్లికూడా వచ్చివున్నారు.

కరుణాకరం తల్లి సీతాబాయమ్మ కొడుకుని ఘట్టిగా కౌగిలించుకొని : "నన్ను చంపుకుతిన్నట్టే ! మళ్ళీ ఇంక పట్నం పోనని వొట్టేసుకో, నామాంట చూసినట్టే..." అంటూ శోకన్నాలు సాగించింది.

సరళ చక్రాళ్ళాటి కాటుకకళ్ళతో విచారం వెదజల్లుతూ "ఉండవే, అత్తా, బావని కాస్త విశ్రాంతి తీసుకోనీ. ఇంటిలో పాదం పెట్టాడో లేదో, అందరూ తలో మాటా అంటే ఎలా ? కాఫీ అయినా తాగనివ్వం ?" అంది తను ఒక్కతే బావ పక్షమైనట్టు.

కింద ఏడుపులూ మొత్తుగోళ్లూ అయిన తర్వాత కరుణాకరం, మేడమీదనున్న తనగదిలోకి వెళ్ళాడు. అతని వెనకాలే సరళా వెళ్ళింది-కాఫీ పాట్‌తో.

"బావా, నామీదకూడా నీకుకోపమా ?" అంది సరళ, నెమ్మదిగా మాటల్లోకి దింపుతూ.

"ఛా, నీమీద నాకెందుకు కోపం! ఈరాత్రి వెళ్ళిపోవాలి, ఎలాగా అని ఆలోచిస్తున్నా, మనవాళ్ళు వొట్టి మూర్ఖులు ఇలాటి తలిదండ్రుల్ని పూజించడం ఎలా ? ఈ దెబ్బతో నాకు 'మనవాళ్ళు' అంటే వున్న మమకారం అంతాపోయింది. నాకూ ఈయింటికీ నేటితో ఋణం తీరిపోతుంది."

"ఎందుకు బావా, అలా అంటావ్ ? నువ్వు సుమిత్రని పెళ్ళిచేసుకుంటేమాత్రం ఇక్కడికి రాకూడదూ ? ఎవర్ని

చూడకపోయినా నన్నయినా చూడాలని అనిపించదా నీకు?''
సులువైన మాటల్లో రసమయకవిత్వాన్ని వొలికించగలరు స్త్రీలు - కొన్నికొన్ని సందర్భాలలో. ఆ విద్య వారికి జన్మతా వొస్తుంది బావని కట్టెయ్యాలనే కోరిక సరళకి వుందిగాని తన సమర్థతపట్ల ఆమెకి విశ్వాసం లేదు.

''సరళా, నీమీద నాకెప్పుడూ అభిమానమే. ఈ నాలుగు గంటలూ నువ్వు వున్నావు కాబట్టి ఉండగలుగుతున్నాను. లేకపోతే వీధిలోనుంచి అలాగే వెళ్ళి పోయేవాణ్ణి.''

మధ్యాహ్నం భోజనాలయాక, మేడమీద కూచుని, బావకి తాంబూలం యిస్తూ, సరళ అంది : 'బావా, నాకు మరొకళ్ళని పెళ్ళి చేసుకోవాలని లేదు. యం. బి. చదివి స్వతంత్రంగా జీవించాలని ఉంది. నీకూ సుమిత్రకీ పెళ్ళి అయినతర్వాత మీరిద్దరూ కలిసి నాకీసాయం చెయ్యాలి.''

''ఎందుకు పెళ్ళి చేసుకోవు, సరళా ?''

''నువ్వు అడగకూడదు ఆమాట.''

''నేను నిన్ను డిజపాయింట్ చేశానా ?''

''అడగవద్దన్నానుగా-అడగకు, వెంకట్రామయ్యమామకి నేను చదువుకోడం యిష్టం ఉండదు. ఈయింటిలో మనిద్దరం తప్పబుట్టాం. నువ్వు నన్ను పెళ్ళి చేసుకోకపోవచ్చు కాని బావవి కాకపోతావా ?'' అని సరళ చిరునవ్వు నవ్వినప్పుడు పడ్డ ఆ చెక్కిళ్ళ సొట్టలు, కరుణాకరానికి అల్లరిజ్ఞాపకాలు గుర్తుకి తెచ్చాయి. ఆమె పాపిటమీద చెయ్యివుంచి 'సరళా' అన్నాడు.

"ఏం బావా !" అంది.

ఏమీలేదు. మనసులోని శృంగార భావాలుచేసే శబ్దా లవి, వాటికి అర్థంపర్థం ఉండవు. కరుణాకరానికి సరళమీద అనురాగం లేకపోలేదు. కాని తను సుమిత్రకి హృదయాన్ని యిచ్చేశాడు, సరళ యం. బి. చదవడం విషయంలో సుమిత్ర ఎంతో సహాయంచేస్తుంది. సుమిత్ర అంటే ఏమిటో వీళ్ళం దరికీ ఇంకా తెలియదు.

ఆరాత్రే తన ప్రయాణమని తెలీగానే, తల్లి సీతా బాయమ్మ నూతిలో దూకేందుకు అన్నిఏర్పాట్లు చేసు కుంది; ఆప్రయత్నం విఫలమవడంవల్ల నాటువిషం తెప్పించు కుంది. కరుణాకరానికి ఏమీంతోచలేదు. అవతల మెయిల్‌కు టైమౌతోంది ! ఇంటిలో తల్లి ప్రాణాపాయస్థితి. బావని పనిగట్టుకు మేడమీదికి పిల్చింది సరళ.

"బావా ! మెయిల్‌కి వెళ్తున్నావా, ఉంటావా ? సీత మ్మత్తకి ఏమీ ఉపద్రవంరాదు. ఆమె అఘాయిత్యం మనిషి కనక అలా జేస్తుంది. నువ్వువెళ్తానంటే నీకు ఓమాట చెప్పాలి."

"ఏమిటది ?"

"వెళ్తున్నావా ?"

"వెళ్ళకపోతే సుమిత్ర చాలా బాధ పడుతుంది."

"పెట్టె అవీ యిక్కడ వొదిలేసి, ధైర్యంచేసి వెళ్ళు. రైలుకి ఇంకెంతో టైములేదు."

"నువ్వు చెప్పు, సరళా. అమ్మకేమీ ప్రమాదం లేదు గదా! నేను వెళ్ళిపోయానని తెలిసి—"

"పిచ్చిబావా, మన కుటుంబాల సంస్కారానికి మీ అమ్మ ఒక నమూనా."

సరళ నిశితదృష్టికి కరుణాకరం విభ్రాంతుడయ్యాడు, ఎంత లోతుగుండె ఆమెది! సరళ ఎంతటి సగసురాలు.

"ఏమిటో చెబుతానన్నావు?" అని అడిగాడు కరుణాకరం.

"నువ్వు వెళ్ళబోయేముందు."

"నేను వెళ్ళకపోతే— ?" అను సరసోక్తికి సరళ బిత్తరపోయి, "సుమిత్ర నిన్ను నమ్మింది. సరళని నువ్వు భార్యగా గాక వేరురకంగా ప్రేమించగలవు" అంది.

పిడుగులుపడ్డా మెయిల్‌కి వెళ్దామనుకున్నాడు కరుణాకరం. కాని రెండు నిముషాల్లో మెయిల్ తప్పిపోయింది. సుమిత్రకి ఎక్స్‌ప్రెస్ వైర్ యిచ్చాడు. ఆరాత్రి వెన్నెలలో సరళా తనూ మల్లెపందిరదగ్గిర మడతమంచాలు వేసుకు పడుకున్నారు. ఎన్నోసంగతులు, అర్థం వున్నవీ లేనివీ, మాట్లాడిందా రాత్రి సరళ. తెల్లారేటప్పటికి సీతాబాయమ్మ శుభ్రంగానే ఉందిగాని సరళతల్లి సుభద్రమ్మకి ఎక్కడనుంచి వచ్చి పట్టుకుందో కలరా పట్టుకుంది. ఆసాయింత్రం నాలుగు గంటలకి సరళ తల్లిలేని కన్నెపడుచు అయింది; తండ్రి ఏనాడో గతించాడు; నేడు తల్లికూడా కరువైంది; అయినప్పటికీ మనోనిబ్బరం విడవలేదు ఆ అమ్మాయి.

"నా బాధలు నేను పడతాను, బావా, నువ్వు వెళ్ళిపో" అంది సరళ. కరుణాకరానికి కాళ్ళాడ లేదు. సుభద్రమ్మ చనిపోతూ అతనితో అంది: "నాయనా! నువ్వు ఎవర్ని పెళ్ళిచేసుకున్నా, తల్లీ తండ్రీ లేని సరళని కాస్త కనిపెట్టి, దాని యోగక్షేమాలు కనుక్కుంటూ వుండు."

కరుణాకరం మర్నాడూ వెళ్ళలేక పోయాడు. సుబ్రావ్ మరొక టెలిగ్రాం యిచ్చాడు అత్యవసరంగా తెలుపుతూ. అయిదోరోజు సాయంత్రం కాబోలు, చీకటిపడుతూవుంది. స్నానంచేసి బట్టలు మార్చుకునేందుకు మేడమీదికి వెళ్ళాడు కరుణాకరం. ఆగది చీకటిలో ఎవరో వెక్కివెక్కి ఏడుస్తున్నారు. స్విచ్ నొక్కకుండా పిల్లిలా అడుగులు వేసుకుంటూ దగ్గిరికి వెళ్ళాడు. ఎవరు? సరళే.

"బావా, నువ్విక్కడనుంచి వెళ్ళిపో, బావా, సుమిత్ర దగ్గిరికి వెళ్ళిపో, బావా" అంటూ రెండుచేతులూ మెడకి పెనవైచి, గుండెలమీద తల ఆనించి, పెద్దపెట్టున ఏడ్చింది సరళ. కరుణాకరం ఆమె తల నిమురుతూ మొహం తన చేతుల్లోకి తీసుకున్నాడు. వెచ్చటికన్నీళ్ళు అతని అరిచేతుల్లో రాలాయి. ఆమె మొహం పైకియెత్తాడు. కనురెప్పలు రెండూ వంచేసింది సరళ. భయంకర వేగంతో ఆమెగుండె దడదడ కొట్టుకొంటోంది. ఆ చీకటిలో రెండు విభిన్న ప్రకృతి శక్తులు వీరవిహారం చేస్తున్నాయి. కరుణాకరం, సరళ— అనేవి నామధేయాలుమాత్రమే. పురుషుడూ, స్త్రీ— తెలిసీ

తెలియకా ఒకరికోసం ఒకరు అలా తపనపడటం సృష్టి శాసనం. అతని పెదవులు వెతుకుతున్నాయి.

"వొద్దు, బావా, వొద్దు. నువ్వు సుమిత్రమనిషివి, నే నిల్లా బతకడం నీకిష్టంలేదా ?" అంది సరళ కటువుగా.

"నన్ను సమస్తం మర్చిపోనీ, సరళా...ఏదీ—"

సరళ కా సాయింత్రం బావని కాదనగల శక్తి లేక పోయింది. సరళా కరుణాకరాల వివాహశుభలేఖ సుమిత్ర అందుకుని, గాయపడ్డ హృదయంతో మనశ్శాంతి పోగొట్టు కుని, బాబాయి చెప్పిన సింహాళవర్తకుణ్ణి, మారుమాటాడక పెళ్లి చేసుకుంది.

* * * *

నాటికి నేడు—పదేళ్ళతర్వాత. ఆనాడు కరుణాకరం పిరికి పందమాదిరి సుమిత్రనుంచి పారిపోయాడు. ఈనాడు వీలయితే ఆమె కంటపడకుండా తప్పించుకుందా మనుకున్నాడు. కాని సుమిత్రే, సుమిత్రే. అతన్ని సిలబెట్టింది. ఎప్పుడూ ఆమెదే పై చెయ్యి.

ఫ్రంట్ సీటులో తనపక్కన కూచుని ఏవేవో విశాల ప్రపంచపు వార్తలు చెబుతోంది సుమిత్ర. కారు పూనమల్లి హైరోడ్డుమీద నుంచి తిన్నగా తమ బంగాళావైపు తీసుకు వస్తున్నాడు. తన ప్రయోజకత్వంగురించి ఆమె ఏమయినా అడిగితే చెప్పడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇంకా పదిహేను

వేలు అప్పువున్నా ఈ బంగాళా తన కష్టార్జితమే. ఈ కారు తన కష్టార్జితమే. కాస్త మాగాణి పొలంకూడా కొన్నాడు. చెమటోడ్చి సంపాయించడంలో ఎంత సుఖముండేదీ సుమిత్ర ఏ నాడయినా తెలుసుకోగలదా? ఆవర్గం వేరు. తనవర్గం వేరు. ఈ వర్గమనే మాట తనేమధ్యనే నేర్చుకున్నాడు.

వాచరు గేటు తెరిచాడు. కారు పోర్టికోలో ఆగింది.

"కారియర్ తీసుకుపోయి యిద్దరికి భోజనం పట్టుకురా" అన్నాడు కరుణాకరం వాచర్‌తో.

"చంపావ్, మీ శ్రీమతి యింట్లో లేదా, ఊళ్ళో లేదా, నిన్ను వొదిలేసిందా?" అని అడిగింది సుమిత్ర—మెట్లమీద పాదం పెడుతూ,

"మొన్న సాయంత్రమే మాఊరు వెళ్ళింది. నీకు మల్లేనే నాకూ యిద్దరూ పిల్లలు. పిల్లలుకూడా తల్లివెంట వెళ్లారు."

"గుడ్. ఏమిటి చెప్పు ఖబుర్లు?" అంది సుమిత్ర డ్రాయింగ్‌రూమ్ సోఫాలో చతికిల బడుతూ.

"స్నానం చేస్తావా?"

"నేను రైలుదిగి రాలేదుగా? ప్రయాణం మానేసి వచ్చాను...పొద్దున్నే ఎక్స్‌ప్రెస్‌కి నన్ను ఎక్కించాలి సుమా?"

"తప్పకుండా" అంటూ కరుణాకరం బాతురూమ్‌లోకి వెళ్ళి స్నానంచేసి వచ్చాడు.

ఇద్దరూ భోంచేసింతర్వాత తమలపాకులు బాగా నమిలారు. సుమిత్ర పైకి ఎంత నవ్వుతూ మాట్లాడినా ఆమెలో ఒక అగ్నిపర్వతం ఉందని కరుణాకరానికి తెలుసు. అది ఏక్షణాన పేలుతుందో అని భయం.

"సుమిత్రా, నన్ను క్షమించావా ?"

"Don't talk rot. Behave like a grown - up man" అంటూ ఛర్రున లేచింది, కూచున్న కుర్చీలోనుంచి.

కరుణాకరం సుమిత్ర చేతులు పట్టుకోబోయాడు. ఆమె విదలించుకుంది.

"కరుణ్, నేనెంత బాధపడ్డానో నీకు చెప్పడం ఎందుకు ? మోసగించబడ్డ ఏ స్త్రీ బాధపడదు కనక ? పాతబాధలు కెలికి నిందారోపణలుచెయ్యడ మెందుకు ? ఇక్కడికి వస్తానా, వెర్రివాడా, నిన్ను క్షమించకపోతే."

"లోకాలు వెలిగించగల ప్రేమజ్యోతి నీలో ఉంది. కాని దాన్ని పొందే యోగ్యత నాలో లేకపోయింది."

"అదే విచారించాను. అయోగ్యునికి హృదయ మమ్ముకున్నానే అని. పోన్లే, అయిపోయినదానిగురించి యిప్పుడెందుకుగాని, నువ్వూ నీభార్యా సుఖంగా ఉంటున్నారా ?"

"ఓ, నువ్వూ మీ ఆయనో ?"

"స్త్రీకి ప్రేమానుభవం ఒక్కసారే సంభవిస్తుంది, కరుణ్. ప్రేమ అనేది ఒక్కసారే కలుగుతుంది. మిగతా

జీవితమంతా యిల్లూ వాకిలీ, బంధుమిత్రులూ, సొసైటీ యిత్యాదులు.''

''నిన్ను పొందగలిగే ఔన్నత్యం నాలో లేదు, సుమిత్రా.''

''అది వేరే చెప్పాలా? మన జీవితాలే ఆ సంగతి రుజువు చేస్తున్నాయి చుట్టూ కట్టుకున్న పేకమేడలే పడగొట్టలేని మన శక్తిసామర్థ్యాలెంత?''

''నిజమే, సుమిత్రా, అల్పుణ్ణి. కాని నిన్ను తలుచుకోని రోజులేదు. ఈనాటికీ నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. ఒకనాడు అంత గొప్పప్రేమ పొందాననే భావనే నా జీవితానికి జీవగర్ర అయింది. నేడు నా జీవితం సంసారానికీ, ధనసంపాదనకీ, వ్యర్థమైన పటుకుబడికీ అంకితమయింది. రోజులు యిలా గడుస్తాయి. దీనికి మార్పు ఉండదు. చిట్టచివరికి శూన్యం మిగులుతుంది.''

''ఎవరికయినా అంతేగా, కరుణ్.''

కరుణాకరానికి ఆ రాత్రి సుమిత్ర అమృతం పంచియివ్వడానికి అవతరించిన మోహినిలా కనిపించింది. నిస్సారమైన తన జీవితంలో ఏ అమృతవర్షం కురిపించనుందో? ఎలక్ట్రిక్ దీపాల వెలుగు ఆమె చెక్కిళ్ళమీద జారుతోంది. పదేళ్ళ క్రితం సుమిత్ర బాల. నేడు రూపవయోవిలాసిని. తను అంత కర్తనని ఆమెకి తెలుసు. అందానికి తగిన విద్యా, ధనమూ కూడా ఉన్నాయి. ధైర్యంలేక, సరళపన్నిన వుచ్చులో

నుంచి తప్పించుకోలేక, తను ఈ సంసార కూపంలో పడ్డాడు. తెగించి, తను సుమిత్ర ముంగిట నిలిచివుంటే, తన జీవితమే పూలతోట అయేదికదా! తను పదేళ్ళు కష్టపడి సంపాయించిన సంపాదన సుమిత్రకి వున్న ఆస్తిలో ఎన్నో వంతు? దురదృష్టవంతుణ్ణి ఎవరు బాగుచెయ్యగలరు?

కరుణాకరం మనసు రకరకాల పరుగులెత్తుతోంది. క్షణక్షణానికీ ఆమెమీద వాంఛ ప్రబలుతోంది. తనమీద యిష్టం లేకపోతే యింటికి ఎందుకు వస్తుంది? సరళ వూళ్ళో ఉందనుకుని వచ్చిందేమో! ఏమయినా ఈరాత్రి ఎలా గడుస్తుంది? తను పిరికిపంద అయినప్పటికీ పదేళ్ళతర్వాత ప్రాప్తమయిన అమృతఘడియలు.

"సుమిత్రా!"

"Yes"

"ఇలాంటిరాత్రి ఈ జన్మకి తిరిగి రాదు."

"అవును."

"ఇలా నా పక్కనివచ్చి కూచోకూడదూ?"

సుమిత్ర కరుణాకరం కూచున్న సోఫాలో కూచుని, ఆతని భుజంమీద చెయ్యివేసి, వీపు చరిచింది. కరుణాకరం నిలువెల్లా కంపించాడు. అలాంటి కంపరం సుమిత్రలో లేదు. ఆమె కళ్ళల్లోకి ప్రార్థనాపూర్వకంగా చూశాడు కరుణాకరం. ఆమెకి యిట్టే అర్థమయింది. "తప్పుకాదూ!" అంటూ అతని చెంపమీద చిన్నగా, లాలిత్య మొలికేటట్టు కొట్టి,

కిందనున్న గెస్ట్‌రూమ్‌లోకి పారిపోయి, తలుపు లోన గడియ వేసుకు నిద్రపోయింది.

ఆ రాత్రి కరుణాకరం యమయాతన పడ్డాడు. చావు బతుకుల సంధ్యారాగం తెలుసుకున్నాడు. తెల్లారి ఎక్స్‌ప్రెస్‌కి వెళ్ళిపోయింది సుమిత్ర. కరుణాకరం బతకనూ లేదు, చావనూ లేదు; మృతజీవనుడు. అందీఅందని సుమిత్ర అతనికి మిగిలిన కొద్దిపాటి మనశ్శాంతినీ దగ్ధం చేసింది. ఆమైనా కసి కొద్దీ చెయ్యలేదు—అనుకోకుండా జరిగింది.

# త్రీ - నోట్స్

కాస్మాపాలిటన్ క్లబ్బులో టేబుల్ ముందు కూచుని 'త్రీ హార్ట్సు' 'బిడ్' 'త్రీ నోట్స్' అంటూ వుండగా, ఆఫీసు కుర్రాడు చిన్న చీటీ పట్టుకొచ్చి వినమ్రంగా నుంచున్నాడు.

నేను 'త్రీ-నోట్స్' అనేశాను. తరువాత వాళ్ళు 'పాస్' అన్నారు ఆడవలసి నాయన ముక్క దిగాడు. నా పార్టనర్ ముక్కలు పరిచాడు.

ఆఫీసు కుర్రాడు : 'సార్, అర్జంట్ ఫోన్ మెస్సేజి, సార్!'' అంటూ భక్తి వినయాలతో చీటీ చేతి కందిచ్చాడు.

చీటీ విప్పిచూసుకునేటప్పటికి ప్రపంచం కూలిపోయిన ట్లనిపించింది. మనసు పరిపరివిధాల పోయింది. అందులో ఉన్నవి రెండే ముక్కలయినప్పటికి ఆ రెండూ బాంబ్ షెల్స్. ''శివశంకరమ్ తెల్లారినప్పట్నుంచీ కనిపించడం లేదు. ఏం చెయ్యాలో తోచడం లేదు—కిరణ్మాయి.''

ముఖంలో వేదన కనిపించకుండా, అగ్నిపర్వతపు భుగ భుగలు గుండెల్లో ఉన్నప్పటికీ పైకి ఒక్క చిరునవ్వు విసిరి, తొందర పనిమీద వెళ్ళాలంటూ నా 'హాండ్' మరొకరికి వొప్పజెప్పాను.

క్లబ్బునుంచి కిరణ్మాయి యింటికి వెళ్ళేందుకు, ఎంత లేదన్నా పదిహేను నిమిషాలు పడుతుంది. ఈ కాసేపట్లో ఎన్నెన్నో

ఆలోచనలు తరుముకు వచ్చాయి. శివశంకరానికి యాక్సిడెం టేమీ జరగలేదు గదా! ఏ కారుకిందనో, ఎలక్ట్రిక్ ట్రెయిన్ కిందనో పడలేదుగద! ప్రమాదాలు చెప్పి రావు. డ్రయివర్ల అజాగ్రత్తవల్ల రోడ్డు ప్రమాదాల సంఖ్య దిన దినానికీ పెరుగుతోంది. యాక్సిడెం టయితే కిరణ్మయికి ఎందుకు తెలియదు? యాక్సిడెంటనే చెబుతుందిగా మెస్సేజిలో.

భార్యా భర్త లిద్దరూ తగవు లాడుకున్నారా? నడ్డ గింజలో బియ్యపుగింజలా, అడపా దడపా వారు ఏమయినా మాటలు అనుకున్నప్పటికీ, యిద్దరి మధ్యా అంత తీవ్రమైన అభిప్రాయభేదా లంటూ లేవు. పామూ ముంగిసలా పట్టు బట్టరు. పట్టూ విడుపూ పదిహేనేళ్ళ దాంపత్యంలో వారికి బాగా వొంటబట్టింది. శివశంకరమ్‌గాని ఒక వేళ తను పట్టిన కుందేలుకి మూడే కాళ్ళు అంటే, అవు నని కిరణ్మయి ఎంత చక్కగా తల వూపేది! అలాగే కిరణ్మయిగాని మూతి బిడాయించుకు కూచుంటే, ఆమెని మాట్లాడించిగాని శివ శంకరమ్ మరొక పని తలపెట్టేవాడు కాదు. వారు ఆదర్శ దంపతులలో, చిలకా గోరువంకలో నేను చెప్పలేను గాని, వారి సంసారంలో క్షీరోదక న్యాయం కనిపించేది.

శివశంకరానిదీ నాదీ ఈనాటి పరిచయమా? కాలేజీ రోజుల్లోనుంచీ యిద్దరం ఒకరికొకరం బాగా తెలుసు. మధ్య మధ్య ఉద్యోగరీత్యా ఏడాదీ రెండేళ్ళు దూరంగా ఉంటు

న్నప్పటికీ మళ్ళీ కలుసుకుపోయేవాళ్ళం. 24 వ ఏట కాబోలు అతను రావ్ అండ్ శర్మా లిమిటెడ్‌లో ఒక చిన్న గుమాస్తాగా చేరాడు—ఆ చేరడం కూడా నా ప్రోద్బలం మీదనే చేరాడు. జమీందారు దగ్గర ఠాణేదారు గిరీకంటె పెద్ద పట్నంలో చిన్నకంపెనీ ఉద్యోగం ఉత్తమమని అతనికి మన స్ఫూర్తిగా నచ్చింది. ఉద్యోగంలో చేరిన ఏడాదిన్నరకి కిరణ్మయిని పెళ్ళిచేసుకున్నాడు. కిరణ్మయి అసలుపేరు సుభద్ర. వివాహానంతరం శివశంకరమే సుభద్రని కిరణ్మయిగా మార్చాడు. ఆనాటి పెళ్ళిపెద్దలలో నేను కూడా ఒకణ్ణి. తెలుగు బాగా వచ్చినప్పటికీ కిరణ్మయి కన్నడ దేశస్థుల పిల్ల. కిరణ్మయి అన్నగారు కూడా అదే ఆఫీసులో పనిచేస్తూ వుండేవాడు. ఆమె అప్పటికి స్కూల్ ఫైనల్ చదువుతూ వుండేది.

కిరణ్మయికీ శివశంకరానికీ మనసూ మనసూ కలిశాయి. పిల్ల తరపువారికి అభ్యంతర మేమీ లేకపోయింది గాని శివశంకరమ్ తండ్రివచ్చి, పెద్ద ఆర్భాటం చేసి వెళ్ళాడు. ఏమయితేనేం, కొందరు మిత్రులం పూనుకుని, వారిద్దరికీ వివాహం జరిపించాము. కాలక్రమేణా వారికి ఒక అబ్బాయీ, ఒక అమ్మాయీ కలిగారు.

శివశంకరమ్ చిన్న గుమాస్తానుంచి సెక్షన్ హెడ్ అయ్యాడు; కొన్నాళ్ళతన్ని సూపర్ వైజర్ అని పిలిచేవారు; తరువాత ఏదో దూరపు బ్రాంచికి మేనేజరు చేశారు;

ప్రస్తుతం హెడ్ ఆఫీస్‌లో అసిస్టెంట్ మేనేజరుగా ఉన్నాడు. నాకు మల్లే నాలుగు రకాల ఉద్యోగాలు చేసి, నాలుగు రకాల వ్యాపారాలలో చేతులు కాల్చుకోక, ఏదో తిన్నగా, ముక్కుకు సూటిగా జీవితాన్ని గడుపుతువస్తున్నాడు. మొన్న ఆగస్టునాటికి అతనికి 42 వచ్చాయి. నాకు పుట్టిన పండగేమిటని అతను గునవడమూ, చేసితీరతానని కిరణ్మయి పట్టు పట్టడమూ, యిద్దరి తగవూ నేను తీర్చడమూ, నిన్న గాక మొన్న జరిగినట్లుంది.

స్వంత లాభాలకోసమూ, స్వప్రయోజనాలకోసమూ మాత్రమే స్నేహాలు ఏర్పడే ఈ రోజుల్లో, నేనూ శివశంకరమూ మా ఆత్మీయతను తలుచుకు గర్వపడేవాళ్ళము. రెండు దశలు పైగా గడిచింది. ఇద్దరి మధ్యా ఉన్న స్నేహబంధం ఏమాత్రం సడలలేదు. కిరణ్మయి అతనికి సహధర్మచారిణి అయితే, నాకు ఆత్మబంధువు. ఆమె భర్తమీద అలిగిన సందర్భాలు ఎన్నో వున్నాయి; కాని నా మాట ఏనాడూ కాదనేది కాదు. ఒకవేళ నా సలహా తాత్కాలికంగా రుచించకపోయినా, వగరూ చేదూ కూడా వొంటికి మంచిదే అన్న విశ్వాసంతో నేను చెప్పినట్లు చేసేది.

"శివశంకరం లేకపోతే కిరణ్మయి జీవితం ఏమిగాను?"— ఈ ఆలోచనని ఎంత తొక్కిపెట్టినా, అది వెయ్యితలలతో పైకిలేచేది. హక్కులు గురించీ, అవకాశాలు గురించీ, ఆస్తులు గురించీ, స్త్రీలు ఆందోళన సలపవచ్చు,

ఎన్ని చెప్పినప్పటికీ స్త్రీలు స్త్రీలే. లత పాకేందుకూ, ఎదిగేందుకూ ఆధారం కావాలనేది లోకనీతి. లత ప్రాకానుకు చుట్టుకోవడం సహజధర్మం. సంఘంలో కిరణ్మయి స్థానం శివశంకరం భార్యగా నిర్ణయమవుతోంది. ఆ శివశంకరం లేనప్పుడు ఆమెకు పూర్వపు గౌరవ మర్యాదలు ఎక్కడ నుంచి వస్తాయి? ఇది కొత్తసంగతి కాదు. తరతరాలుగా యుగయుగాలుగా జరుగుతున్నదే! కిరణ్మయీ, ఆమె యిద్దరు పిల్లలూ ఏమవుతారు? కొత్తగా కట్టించిన యింటిమీద యింకా మూడువేలు అప్పు ఉందన్నాడు శివశంకరం ఆమధ్య. కారుమీద మాత్రం అప్పూ సప్పూ లేదు.

ఒకటా? ఒకదానికీ మరొకదానికీ సంబంధం లేని ఆలోచనలు ఎన్నో వచ్చాయి. చడీ చప్పుడూ లేకుండా కారు యింటిముందు ఆపి, గేటు తెరుచుకు లోపలికి వెళ్ళాను. కిరణ్మయి తలలో ఎప్పటి మాదిరిగానే పూలు ఉన్నాయి. ఎప్పటి మాదిరిగానే తెల్లచీరె కట్టుకుని పాప్లిన్ జాకెట్టు వేసుకుంది. ఎప్పటి మాదిరిగానే సన్నని యుడికొలోన్ వాసన వచ్చింది.

అన్నం మానేసి, ఏడుస్తూ ఒకమూల కూచోడు కిరణ్మయి—అని నాకు తెలుసు. కాని యింత ధైర్యంతో ఉండగలదని అనుకోలేదు.

"ఏం జరిగింది?" అని అడిగాను.

"ఏముంది—ఒక ఉత్తరం రాసిపెట్టి వెళ్ళిపోయారు ఏదో

ఆఫీసు పనిమీద క్యాంపుకి వెళ్ళారని పైన అద్దెకున్నవాళ్ళకు, పిల్లలకు చెప్పాను" అంది కిరణ్మయి.

ఇంటి పై భాగం అద్దెకిచ్చి, కింద వీళ్లు ఉంటున్నారు. మేడ అద్దె, జీతంలో కొంతా వేసి ప్రతినెలా ఈ యింటిమీద వున్న అప్పు తీర్చుకుంటూ వస్తున్నారు. నేనేదో అడగ బోతూ వుండగా, బడిలోనుంచి మధూ సుశీలా వచ్చారు. పిల్ల లిద్దరికీ హోవల్టీనూ, నాకూ అమ్మగారికీ టీ కలిపి పట్టు కొచ్చింది పనిమనిషి.

"టీ తీసుకోండి" అంది కిరణ్మయి. నా కేదో ధైర్యం చెబుతున్నట్టు. డైనమైట్ ఉన్న పెట్టెమీద కూచుని సిగ రెట్టు కాలుస్తున్నట్టుంది నా పరిస్థితి.

పిల్ల లిద్దర్నీ ప్లే గ్రవుండ్ దగ్గరికి తీసుకువెళ్ళమని పురమా యించింది పనిమనిషితో. వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత, రేడియోకిందనుంచి ఒక ఉత్తరంతీసి నాచేతి కిచ్చింది.

"ఇప్పటి కొక యాభైసార్లు చదివి వుంటానేమో! మీరు నెమ్మదిగా పైకి చదవండి. ఇంకోసారి వినాలని వుంది."

ఉత్తరం పైకి చదివాను:

"దేవీ! అయిదారు నెలలబట్టీ నా మనసు ఎందుకో ఆవేదన పడుతోంది; దేనినో అందుకోవాలని తాపత్రయ పడుతోంది. పద్దెనిమిదేళ్ళు నౌకరీచేసి ఏదో శాస్త్ర సంపా దించాను. పిల్లలకు గ్రాహ్యాం వస్తోంది. నువ్వు వ్యక్తిత్వాలివి. నాకు నీమీద ఏ కోపమూ లేదు. మా మేనేజరు యింట్లో

యోగానందస్వామిని చూసినప్పట్నుంచీ నాకు ఈ జీవితం మీద, ఈ ప్రలోభాలమీద విరక్తి ఏర్పడింది...అరిషడ్వర్గాలను జయించగలిగే సత్తువ నాలో లేకపోయినప్పటికీ, ధర్మార్థ కామమోక్షములలో మొదటి మూడూ అయిపోయినాయి కాబట్టి, నాలుగోది వెతుక్కునేందుకు నేను వెళ్ళిపోతున్నాను. నన్ను వెతక్కు. మీ వాళ్ళచేత వెతికించకు. నీకే సాయం కావలసినా సారథిని అడుగు. అతన్ని అడిగేందుకు సంశయించకు—శివశంకరమ్.''

''అసలు కథేమిటి?''అని సూటిగా ప్రశ్నించాను కిరణ్మయిని.

''కథ అనేది ఒకటి ఉంటేగా నేను చెప్పేందుకు?''

''అతనిలో మార్పు ఏమైనా మీరు గమనించారా?''

''నేను కనిపెట్టేందుకు ఏ మార్పూ లేదు. నిన్న సాయంత్రం కూడా మామూలుగానే భోజనం చేశారు రాత్రి తమలపాకులు వేసుకున్నారు పడుకోబోయేటప్పుడు పాలు పుచ్చుకున్నారు.''

''నిన్న మీరు మాట్లాడుకున్న మాటలు కాసిని చెప్పండి.''

''పెద్ద పెద్దవిగాని, కొత్త కొత్తవిగాని ఏమీ మాట్లాడుకోలేదు. సుశీల స్కూల్లో జరిగే పేరెంట్స్ డేకి తప్పక వెళ్ళాలన్నారు. మధుకి కొత్త పెన్ను కొని పట్టుకొస్తానన్నారు. రాత్రి పాలు పుచ్చుకుంటూ ఒక్కమాట అన్నారు సుమండీ—

'పెళ్ళినాటి రాత్రి కూడా యిదే గ్లాసుతో పాలు తీసుకొచ్చి యిచ్చావుకదూ ?'—అని. ఎన్నో వెండి సామానులు మా పించాము; చెరిపించి చేయించాము—కాని ఆ గ్లాసుమట్టుకి అల్లాగే ఉంది. పిల్ల లెప్పుడూ ఆ గ్లాసు ముట్టుకోరు. ప మనిషి కూడా ఎంతో జాగర్తగా కడుగుతుంది. వెనక ఒక పనిమనిషి ఆ గ్లాసు కిందపడేస్తే, దానిని కొట్టాలన్నంత కోపం వచ్చింది.''

ఆ గ్లాసు మామూలు వెండిగ్లాసే ! కాని దానికి ఆ భార్యాభర్తలు యిచ్చుకున్న విలువ అపారం. అది పెళ్ళి బహుమానంగా కొని యిచ్చినవాడిని నేను. వ్యక్తులనుబట్టి వారు యిచ్చిన వస్తువుల మీద కూడా ఒకప్పుడు తీవ్రమైన మమకారం ఏర్పడుతుంది. నేను బహుమతిగా యిచ్చిన గ్లాసులో క్షీరం మాత్రమే పోసి, తనభర్త కొక్కడికే యిచ్చే కిరణ్మయి స్నేహశీలతమీద నాకు గౌరవం ఉండటంలో ఆశ్చర్యమేముంది ? అలవాటైపోయి కూడా కొన్నికొన్ని వస్తువులూ, ప్రవర్తనలూ తమ నిత్య నూతన పరిమళాన్ని పోగొట్టుకోవు. అలాంటిదే ఈ వెండిగ్లాసు మా ముగ్గురి మధ్యా.

''ఈ అనురాగాలు ఎలా ఛేదించుకో గలిగాడు శివశంకరమ్ ! నా కేదో అంతు చిక్కకుండా ఉంది. మొన్న ఆదివారం మీ యింటి కొచ్చినప్పుడు కూడా, వేసంగిలో తప్పకుండా కొడైకెనాల్ వెళ్ళాలన్నాడు నాతో. అతని డ్రాయరు

తెరిచి, ఉత్తరాలూ అవీ చూడండి. ఏవైపుకి వెళ్ళాడో వివరాలైనా తెలుస్తాయి."

"వివరాలు తెలుసుకుందాము గాని ఆయన్ని వెనక్కి తీసుకొచ్చే ప్రయత్నం మనం చెయ్యనద్దు. నేనెంత చేసుకున్నానో, అంతా అనుభవించాలి గదా! ఆయన ముక్తిమార్గానికి నే నెందుకు అడ్డు తగలాలి? పిల్లలూ నేనూ బతకలేక పోము. ఏనాటికయినా ఆయన మనసుమళ్ళి, పెళ్లాం బిడ్డల్ని చూదామనుకుని వస్తారా, సంతోషం. లేదా, యింతే నాకు ప్రాప్తి—అనుకుంటాను."

"మీారు కూడా వైరాగ్యం మాట్లాడుతున్నారే!"

"వైరాగ్యంకాదు, సారధిగారూ! అంతకిమించి ఆడది ఏమి చెయ్యగలదు? ఏ మొహం పెట్టుకు నేను మా వాళ్ళ దగ్గరికి వెళ్ళేది? 'పుట్టినే సన్యాసుల్లో కలిసిపోతాడా, ఏదో కారణం ఉంటుంది—అని అందరూ అనరూ!" అంటూ భరింపరాని శోకంతో తల వాంచేసుకుంది. కన్నీళ్ళు జలజల రాలాయి, కిరణ్మయి తన రెండు చేతుల్లోనూ తల దాచుకుంది.

పదిహేనేళ్ళ మధ్యకాలంలో కిరణ్మయి కన్నీటి బొట్టు నేను ఏనాడూ చూడలేదు. నిండుకుండలాటి మని షామె; తొణకదు, బెణకదు. అలాంటి దీనాడు మనోధైర్యం లేక శోకభారంతో శిరసు వొంచుకుంది.

"చూడండి, కిరణ్మయీ, మీరు చిన్న పిల్ల కాదు. ఇద్దరు పిల్లల భావిజీవితానికి మీరు కర్తలు. శివశంకరం పిచ్చి శంకరం అయి బైరాగుల్లో కలిసిపోయినా, మీరు మీ జీవన మార్గం మరవకూడదు. పురుషు లందరిలోనూ ఆ బాధ్యతా రాహిత్యం కనిపిస్తుంది. కాని, స్త్రీ తన ధర్మాన్ని అనుష్ఠించ వలసిందే. మీకు మీ పిల్లలున్నారు! వాళ్ళని మానుష కలలు గంటూ, మీరు బతకాల్సిందే! మీరు స్త్రీలు. శివ శంకరంలా మీరు దులుపుకు పోలేరు."

కిరణ్మయి ఏడుస్తూవుంటే నా గుండె చెరువయింది. ప్రతి ఆదివారం వాళ్ళింట్లో భోజనం పెట్టేది నాకు. భోజనం పెట్టి అది తినిపించడం కూడా ఒక కళ. ఎంతో ఆప్యాయంగా వండి వడ్డించడంలోని ఆనందం స్త్రీలకే గాని పురుషులకు తెలియదు. కిరణ్మయిని అన్నపూర్ణ అనలేను; మోహినిలా అమృతం పెట్టిందనీ అనలేను; ఆమె చేతి అన్నంతింటే పంచ భక్ష్య పరమాన్నాలూ తిన్నట్టు వుండేది.

ఆ రుచి ఆమె చేసే వంటకాలలో ఉండేది కాదు; ఎన్నో సార్లు ఉప్పు వెయ్యడం మర్చిపోయేది; కొత్తరకం పిండి వంటలు మామీద ఎక్స్‌పెరిమెంటు చేసేది; కాని ఆ సౌరభం కిరణ్మయి హృదయంలో ఉండేది. ఆమెలాంటి దయాంతః కరణ గల స్త్రీ నాకెక్కడా కనిపించలేదు. శరత్ పుస్తకా లలో మాత్రం అలాంటిపాత్రల గురించి చదివాను; ఈ జీవిత భంగుల జీవితంలో కిరణ్మయిని చూశాను. కన్నడనాడులో

జన్మించి, మద్రాసులో పెరిగిన కిరణ్మయి సృష్టిలోని మాధు ర్యానికీ లాలిత్యానికీ ఉదాహరణ.

ఆమెను ఊరుకోబెట్టాను. ప్లే గ్రవుండ్ నుంచి పిల్లలు వచ్చారు. ఏ విపత్తూ జరగనట్టు పెద్దవాళ్ళం ప్రవర్తించాము. ఆ రాత్రి భోజనాలవేళ, కన్నీళ్ళు బొటబొట రాలుతున్నప్ప టికీ, పిల్లలకోసం నవ్వు తెప్పించుకు నవ్వే కిరణ్మయిని చూస్తే నా కడుపు తరుక్కుపోయింది.

శివశంకరం అభాగ్యుడా, నిర్భాగ్యుడా, దౌర్భాగ్యుడా? భార్యా పిల్లల్ని వొదిలేసిన పిచ్చి శంకరానికి సద్గతి ఏమిటి?– వాడి తలకాయ. బుర్రలో ఏదో పురుగు తిరుగుతూ వుండాలి. లేకపోతే యిలాంటి కమ్మటి సంసారాన్ని కాలదన్ని పోయేం దుకు కాళ్ళు ఎలా వస్తాయి?

రెండుమూడు రోజులపాటు కిరణ్మయిని అంటిపెట్టుకునే వున్నాను కాని, లోకమొకటి ఏడిసిందిగా! శివశంకరం సన్యాసుల్లో కలిసిపోయాడనీ సారథి వాళ్ళింట్లోనే ఉంటున్నా డనీ ఆనోటా ఆనోటా పడితే, కథకి కావలసిన సమా చారం పూర్తి అవుతుంది; మా చుట్టూ వున్న మనుషులు నాలుగు నెలలపాటు నోళ్ళు నొక్కుకునేందుకు చక్కటి అవ కాశం లభిస్తుంది. పెద్దకూతురుకు పెళ్ళిచేసిన నేనూ, భర్త ప్రస్తుతం పరారీ అయినప్పటికీ పదిహేనేళ్ళు కాపరం చేసిన కిరణ్మయీ లోకాపవాదానికి జడిసే స్థితిలో లేము. ఏమైనా, 'ముందేమిటి?' అని కొన్ని విశ్చయాలకు రావాలిగదా!

"మీా రిక్కడే ఉండి, పిల్లలకి చక్కగా చదువు చెప్పిం చండి" అన్నాను.

"నేను యిక్కడ ఎందుకు? మా వాళ్ళింటికి వెళ్ళిపోతాను. ఇల్లు కిందభాగం కూడా అద్దెకి యిచ్చేస్తాను. అద్దె వసూలు చేయించి మీరు పంపిస్తారుగా!"

"మీ వాళ్ళింట్లో వుంటే, ఈ స్వతంత్రత, స్వేచ్ఛా ఉండవేమో మీకు! ఇన్నాళ్ళూ మీకు మీరుగా బతికి, ఈనాడు ఒకరింట్లో వొదిగి వుండగలరా?"

"మన యిష్టమేముంది—విధి నిర్ణయంగాని! రోజులు కలిసిరానప్పుడు తలవొంచుకుంటే సరి. ఆయన జ్ఞాపకాల్లో కలిసిపోవడం కంటె న్యూనత ఏముంది? నేను కాస్త డబ్బున్నదాన్ని గనక మావాళ్ళు ఎలానూ గౌరవిస్తారు. నా చెయ్యే పైన ఉంటుంది" అంది కిరణ్మయి. మన అమ్మాయిలకు మనం యింగ్లీషు చెప్పించినా, హిందీ చెప్పించినా వాళ్లు ఉండటానికి వీలయ్యే స్థలాలు రెండే రెండు. అత్తారింట్లోనైనా ఉండాలి, పుట్టింట్లోనైనా ఉండాలి. మిగతా చోట్ల వారికి ప్రవేశం లేదు. పది రోజులు మరొకచోట వున్నా, పది కొండోరోజున వెళ్ళిపోవలసిందే!

విషయం తెలియపరచకుండా కిరణ్మయి తమ్ముడికి వైరిచ్చాను. అతను వచ్చాడు. అంతా సాంగోపాంగంగా విని, 'నీ యిష్టం' అన్నాడు అక్కగారితో. కారు నాలుగు వేల రూపాయిలకు బేరంపెట్టి, యింటిమీదవున్న అప్పు తీర్చివేశాము. కారణం చెప్పకుండా, మూడు నెలల క్రితం యిల్లూ, కారు 'సి' సర్టిఫికేటూ కిరణ్మయి పేర మార్పాడట పిచ్చి శంకరం. అందువల్ల వ్యవహారం నిశ్చింతగా సాగిపోయింది; లేకపోతే కొద్దిపాటి అవస్థ పడవలసి వచ్చేది.

కిరణ్మయిని సాగనంపుతున్నప్పుడు నాజీవితాని కింక వసంతఋతువు లేదనిపించింది. 42 ఏళ్ళ జీవితమూ ఒక్కసారి వెక్కిరించింది నన్ను. ఏముంది? ఏమి సాధించాను! నాలుగు రాళ్ళు సంపాదించి, కట్టుకున్న భార్యద్వారా సంతానాన్ని బడిసి, రేపో నేడో మనుమల్ని ఎత్తబోతున్నాను. కిరణ్మయిమీద నా కెంత అనురాగం వున్నదీ ఆమెని సాగనంపే రోజుదాకా తెలుసుకో లేకపోయాను. అది ధవళమైన అనురాగం. అందులో నీలాకాశంగానీ నెమిలి కంఠం గానీ లేవు. తెలుపు ఏ నిర్మలతని సూచిస్తుందో, ఆ అనురాగ బంధంలో అంతటి స్వచ్ఛందతే ఉంది. నాకు కిరణ్మయి ఎలాటి ఆత్మబంధువో, కిరణ్మయికి నేనూ అంతే నేమో! ఈనాడు శంకరం పిచ్చి శంకరం అయినప్పటికీ ఒకనాడు అతనూ అలాంటివాడే! అంత గొప్పదైన స్నేహమే మా మధ్య లేనప్పుడు ఈ చెలిమి ఇన్నాళ్ళు నిలిచేదా!

కిరణ్మయి వాళ్ళవాళ్ళింటికి వెళ్ళిపోయింది. ఐనప్పటికీ, నెలకు రెండు నెలలకూ నేను కలుసుకుంటానని మాట యిచ్చాను. పిల్లాడు యింకో మూడేళ్ళకు కాలేజి క్లాసులోకి వస్తాడు; అప్పటికి తను తిరిగి మద్రాస్ వచ్చేస్తా నంది కిరణ్మయి. వచ్చి టీచరు పని చేస్తుండట. అది మూడు సంవత్సరాల తరువాత మాట. ఏమైనా, పిల్లల పూచీ నాదట; తనలోగా ఏమైనా అయితే, వాళ్ళకు గార్డియన్ నేనే నట.

మహా ప్రణయాలూ, మహా శోకాలూ కాలపురుషుని ముందు యిసుక రేణువులు. రోజులు గిరగిర తిరుగుతున్నాయి. కిరణ్మయి మద్రాసులో లేకపోవడంవల్ల నా జీవితంలో ఒకమాదిరి చీకటి ఏర్పడి ఆరునెల లయింది. ప్రతివారం ఉత్తరంరాస్తూ వుండేది. ఇంకా, నేనే కాస్త అశ్రద్ధ చేసేవాణ్ని జవాబు యివ్వడంలో.

కారులో బెంగుళూరు పోయివస్తున్నాను. చిత్తూరు కొండలప్రాంతాల డ్రయివర్ కారు ఆపుచేశాడు—యింజనులో నుంచి ఏదో శబ్దంవస్తోంది. బానెట్ ఎత్తి పరిశీలిస్తున్నాడు డ్రయివర్. ట్రంక్ రోడ్డుమీదుగా నడిచి పోతున్న కాషాయ వస్త్రధారి మీద నా దృష్టి పడింది. శివశంకరం తప్పిపోయి నప్పట్నుంచీ ప్రతి సన్యాసినీ పరీక్షగానే చూస్తున్నాను.

కారు దిగి, అవునా కాదా అని తటాపటాయిస్తూ వుండగా, "జై—సీతారామ్" అంటూ అతను నన్ను పలకరించాడు. పూర్వాశ్రమంలో స్వామివారి నామధేయం శివశంకరమే నట. కారు వెనక్కి పట్టించాను. అతను కారు ఎక్కనన్నాడు. భగవంతుణ్ని తిట్టుకుంటూ, శివశంకరం వెంట నేనూ నడిచాను.

పశువుల కాపరులు ఉండే చిన్నగూడెం వద్దకు తీసుకు వెళ్ళాడు నన్ను. అక్కడ వున్నవన్నీ కలిపి యిరవై గుడిసెలు ఉండవు. అందులో ఒకటి స్వాములవారిది. స్వామి వారిమీద అక్కడ వున్న యాభై అరవై మందికీ అమితమైన భక్తి.

"ఇదంతా బాగానే ఉంది. నువ్వు ఎందుకు సంసారాన్ని త్యజించినట్టు ?"

"జై — సీతారామ్"

"ఆత్మలో వెలిగే చిద్బ్రహ్మ యిక్కడగాని కనిపించడా ?"

"జై — సీతారామ్."

"నేను లేస్తాను. స్వాయంత్రం క్లబ్బులో పార్టీ ఉంది. నేను వేళకి ఉండకపోతే బావుండదు."

"సంసారాన్ని ఎందుకు త్యజించానని అడుగుతున్నావు కదూ ?" అని ప్రశ్నించాడు శివశంకరం.

"అవును. చెప్పదలచుకుంటే చెప్పు, లేకపోతే మానేయ్."

"సుశీల ఎవరి పోలికో పరిశీలనగా చూశావా ?" సుశీల వారి రెండో సంతానం.

"ఏం—ఎవరి పోలిక ?" అని ఆదుర్దాగా అడిగాను. పారేసుకున్న తాళం చెవులగుత్తి దొరుకుతున్నట్టుంది.

"దానిలో నా పోలికలు లేవు."

"ఎవరి పోలికలు వున్నాయి ?" నా వెన్ను జలదరిస్తోంది.

"జై — సీతారామ్."

"ఎవరి పోలికలు వున్నాయి ?" అదేదో వింటేగాని ప్రాణం వుండబట్టదు.

"మా మేడమీద అద్దెకున్న........."

ఆపైన వినలేదు. కిరణ్మయి గురించి వాదించ తలుచుకోలేదు. ఈ అనుమ్మాన పిశాచం గురించి ఆమె కసలు తెలు

సునో తెలియదో! తెలిసివుంటే, నాతో చెప్పడానికి కూడా సంశయించేదా? ఏమైనా నేను తెలుసుకోవలసిందేమీ లేదు యింక. "జై—సీతారామ్స్" దగ్గర సెలవుతీసుకుని బయలుదేరాను.

చిత్తూరు దగ్గర కారెక్కినప్పట్నుంచీ ఆలోచనలతో తల దిమ్మెక్కిపోయింది. శివశంకరం ఫలానా చోట ఉన్నాడని కిరణ్మయికి తెలియబరచనా? ఆమె తక్షణం యిక్కడికి వచ్చి అతని అనుమానాన్ని పోగొట్టేందుకు ప్రయత్నం చేస్తుందేమో! కాని అతని అనుమానం తీరేదా? ఎన్నేళ్ళ బట్టీ పాతుకుపోయి వుందో? అయితే, అలాంటి అనుమానం నామీద ఎందుకు లేకుండా ఉండాలి? పోలికల్ని బట్టి ఈ అనుమాన బీజం మొలక ఎత్తిందా? కిరణ్మయికి మాలిన్యాన్ని అంటగట్టే శివశంకరం ఆత్మక్షోభతో పరివర్తన పొందవలసిందేగాని, ఆమెను వెళ్ళి అతని పాదాల మీద పడ మనగూడదు. నిజం—కాని అతను భర్త, ఆమె భార్య. ఈ సమస్య వా రిద్దరిదీను. మధ్యని నే నెవరు? ఇంటికి రాగానే కాగితం కలం పుచ్చుకు కిరణ్మయికి సంగతంతా గబగబా రాసేశాను. కాని, ఉత్తరం చించేసి కాస్మాపాలిటన్ క్లబ్బు పార్టీకి వెళ్ళిపోయాను.

ఈ సంగతి కిరణ్మయికి నాకు నేనుగా చెప్పేందుకు నాటికీ నోరు రాదు.

# మాంగుళూరు మెయిల్

మాంగుళూరు మెయిల్ 1953 మే నెల భారతిలో వెలువడగానే, చాలామంది రకరకాల ప్రశ్నలు కురిపించారు. అప్పటికీ యిప్పటికీ కూడా అడుగుతున్నారు: మంజులత ఎర్రదుద్దుల సంగతి.

అందీ అందని చేలాంచలంలోని సుమిత్ర ముందు, మధ్యరకం కుటుంబంలో పుట్టి మధ్యే మార్గాన నడిచే కరుణాకరం తేలిపోతాడు: చుట్టూ కట్టుకున్న పేకమేడని పడగొట్టలేక పిరికిపందలా పారిపోతాడు.

మంజులత మలబార్ సుందరి; సుమిత్ర తమిళ వనిత; స్త్రీ—నోస్‌లోని కిరణ్మయి కన్నడ కాంత. భార్య భర్త లిద్దరికీ ఎంతో ఆత్మీయుడై, స్నేహ మధురిమ తెలుసుకున్న మనిషి కూడా, కిరణ్మయికి అసలు సంగ తేమిటో చెప్పలేకపోతాడు.